

శిశువుల కొఱకు

# [illegible]థలు, పద్యములు.

ఇవి

క్రొత్తపద్ధతి ననుసరించి పాఠశాలల బాలుర

యుపయోగార్థము వ్రాయబడినవి.


మద్రాసు;

టి. సి. యం. మొకలారి వారిచే

ప్రచురింపఁబడియె.

1909

వెల ఒకఅణా.





S. B. T. PRESS.

# శిశువుల కొఱకు

## కథలు, పద్యములు.



### రాజు, ఏడు చేపలు.

ఒక రాజునకు ఏడుగురు కొడుకులు. వారు ఏటికిఁ బోయి ఏడు చేపలు తెచ్చి యెండఁబెట్టిరి. అందులో ఒక చేప యెండినది కాదు. చేపా! చేపా! నీ వెందుకెండలేదే? దుబ్బు చాటువచ్చినది. దుబ్బా! దుబ్బా! ఎందుకు చాటువచ్చితివే? ఆవు మేసినది కాదు. ఆవా! ఆవా! ఎందుకు మేసినావు కావే? పసువులవాడు మేపనాఁడు కాఁడు. పసువులవాఁడా! పసువులవాఁడా! ఎందుకు మేపినావు కావురా? అవ్వ బువ్వ బెట్టలేదు. అవ్వా! అవ్వా! ఎందుకు బువ్వ బెట్టలేదే? పిల్లవాఁడు ఏడ్చుచున్నాఁడు. పిల్లవాఁడా! పిల్లవాఁడా! ఎందుకు ఏడ్చుచున్నావురా? చీమ కుట్టినది. చీమా! చీమా! ఎందుకు కుట్టినావే? నా కన్నములో వేలు పెట్టిన నేను కుట్టనా! అనెను.

---

హాత్తు! కాకి.

రువ్వ, రువ్వ, రువ్వ,

రొట్టెయెత్తుకపోదు.

వెక్కి వెక్కి వెక్కి

బిడ్డఁ డేడ్చె.

---

బురదలోను పంది

పొర్లాడు చుండెను.

దానిఁ గఱవ వచ్చి

దాటి కుక్క

బురదలోను గూలి

పోయి లేవఁగలేక

బొంయి, బొంయి, బొంయి,

బొంయి మనెను.

---

ఆవా, ఆవా, నీపని యేమి?

పాపా, పాపా, పాలిత్తునురా.

కుక్కా, కుక్కా, నీపనియేమి?

కొంగలువచ్చిన    బొంయ్ బొంయ్ మంగున్.
పిల్లి, పిల్లి,    నీపని యేమి?
ఎలుకలఁ జంపుట    నే నబ్బాయీ.
గుఱ్ఱము, గుఱ్ఱము,    నీపని యేమి?
బండిని లాగుట    బహు వేగముగా.
పాపా, పాపా,    నీపని యేమి?
పాఠము చదువుట    బడికిన్ బోదున్.
బడి విడిచిన త-    ర్వాతనో, నీపని.
ఆడుదు నాటల్    పాడుదుఁ బాటల్.

ఇదిగో, ఇదిగో,    పచ్చ జెండా.
అదిగో, అదిగో,    రైలు బండి.
గఫ్ గఫ్ గఫ్ గఫ్,    గఫ్ గఫ్, గఫ్ గఫ్,
రండీ, రండీ,    వేగము రండీ.
ఇటుయెక్కండీ,    అటుయెక్కండీ.
కో! కో! భస్ భస్,    భస్ భస్, భస్ భస్!
బయలుదేరినది    బండి, పదండీ

గోతియొద్దకు వచ్చెఁ గప్పలు,
గూడు విడిచెను కోడిపిల్లలు.
అవియు నివియును గూడి ముచ్చట
లాడుకొనుచుండెను సుఖంబుగ.
అంతలో నొక పెద్దకప్పకు
అప్పుడే యొక నీడ గనఁబడె.

గద్ద యెగురుచునుండె మీఁదను.
గోతిలోనికిఁ గప్పలురికెను.
గూడు చొచ్చెను కోడిపిల్లలు,

మెఱుపులు తళతళ మెఱయుచున్నవి.
ఉరుములు ఫెళ ఫెళ ఉరుముచున్నవి,
చిటచిట చిటచిట చినుకులు వచ్చెను,
పటపట పటపట వడగండ్లు హాహా!
పడి పడి రండీ, వడగండ్లేర్దము,
పడుచున్నవి మన వద్దనెయివిగో,
షెడిగో నా ఉ~. ఏమిమునీ వడి

రొట్టెదెచ్చి యింటిలోను
  బెట్టి అవ్వ నీళ్ళ కేగ
తిరిగివచ్చి చూడ, రొట్టెఁ
  దినుచు నుండె నొక్క యెలుక.
పళ్ళు గొఱుకు కొనుచు నొక్క
  పిల్లిఁ దెచ్చి యింటఁ బెట్టి
గొల్లపేటలోను పాలు
  గొనుట కొఱకుఁ బోయె నవ్వ.
తిరిగివచ్చి చూడ, పిల్లి
  తినుచునుండె నెలుక నపుడు.
చూచి, సంతసించి, పాలు
  దాఁచి, అవ్వ తలుపువేసి,
పంచదార కొఱకుఁ బోయె
  త్వరితముగ దుకాణమునకు.
అచ్చటనుండి తిరిగివచ్చి
  అవ్వ తలుపు తీసి చూడ,
పాడుపిల్లి రొట్టె మ్రింగి
  పాలుకూడ త్రాగివేసె.

ఒక్క కాపువాని యింటి
  కొక్క నక్క వచ్చెనూ.
గోడమీఁద గూరుచున్న
  కోడివచటఁ జూచెనూ.
“ఏవిధమున నయిన దీని
  నిపుడు మ్రింగ వలయునూ,”
అని తలంచి నక్క యిట్టు
  లనియె చేరి కోడితో,
“కోడిబావగారు, మీకు
  కుశలమా సమ స్తమున్?
మిమ్ముఁ జూడ వలయుననుచు
  మిగులఁ గోరివ చ్చితిన్.
రండి, రండి, కౌఁగలించు
  కొండి మీమఱందినిన్.”
ఇట్లు నక్క మాయమాట
  లెన్నొయాడుచుండఁగా
గోడప్రాఁకనుండి కన్న
  కుక్క వచ్చి గ్రక్కునన్,

మాని తడిసెను బురద నీటను;
జంగమయ్యకు బురదస్నానము
సంభవించెను మీఁదు మిక్కిలి.
"శేషు! వహవ్వా! శేషు! వహవా!
పెంకి జంగమువాని కేమఁగు
తగినశాస్తిని జేసినది" యని
దారి నందఱు చూచి నవ్విరి.

రాజుగారికి నొక జాబు
వ్రాసి మంత్రి
పీరుఖానుని చేతఁ బం
పె నది తాను.
దారిలో నెండ వేఁడికి
తాళలేక,
చెట్టు వద్దకు జని వాఁడు
చేరఁబడియె.
నపుడ చే నెండవేళను
బడలియుండెఁ

గాన నిద్దురపట్టెను
వాని కపుడె
కొంటె మంగలి యొక్కఁడు
గొరిగ, వాడు
మేలుకొనకుండ, గడ్డము
మీస మెల్ల.
కొంత సేపైన పిదప మే
ల్కొని మొగంబు
తడవికొని పీరుఖా నిట్లు
తల్లడిల్లె.
“నేను గాను నిజంబుగ
నేను గాను,
“సీ,దివా నెంత మోసము
సేసినాఁడు!
నన్నుఁ బంపుదు నని ఠీవి
నంపినాఁడు.
“నేను గాను నిజంబుగా
నేను గాను.

మేళము పాట, బళీ!
ఆహా! మేళ్మేళ్, పెండ్లివారి యూ
పతి సుందర, మహాహా!

వేఁటని చెప్పఁగా వెంకటరాజా.
ఈఁటె బుజంబున నిడి బయల్దేరె.
తోఁక యాడించుచు దూరమునుండి.
దూఁకుచు వచ్చెను తోఁపి వేఁపుకుక్క..
చీరమ్ము పెంపొద వెపటిరి వేడ్క
ఊరిలో మగతన మొప్పవారెల్ల.
వారి ధైర్యంబును వారి శౌర్యంబు
వారి యుత్సాహము వార్యమైయుండె.
మునుపటి వేఁటల ముచ్చటల్ సెప్పు
కొనుచు వారేగిరి కుక్కలతోడ.
కొండలు వేవేగ కొండపైకెక్కి
పందులఁ దిగదోలఁ బంపిరిముందు.
ప్రక్కలఁ బంటులు పాటి పోవుండఁ
గుక్కలతోఁ గాచి కొనికొంద ఱుండ్రి.

పోటుబంట్లగువారు మొగలకుఁ బోయి
ఈఁటెలతో నిల్చి రేవుమీరంగ.
వేటరు లందెల్ల వెంకటరాజు.
మేటి పోట్టరి యని మెప్పొందినాడు.
మొగలలో నెల్లను మొదటిదైయున్న
మొగకాచి యీశూర ముఖ్యుఁడు నిల్చె.
కొండ యెక్కినవారు కో, కో, యటంచు,
మెండుగా రాల్ ద్రువ్వ మిక్కిలి యేచ,
సందడి కోర్వఁగఁ జాలక రేఁగి,
పదుటు క్రిందికిఁ బాతిపోఁ జొచ్చె.
కొన్ని, యీఁటెలు చాఁచుకొని క్రిందవేచి
యున్నపోటర్లచే నసురుగోల్పోరు.
అందొక్క యొంటికాఁ డతిబలశాలి.
ముందెన్ని యీఁటెలా మొక్కపుచ్చినది,
ఎంతెంతరాదైన నింతలోఁ జీల్చు
నంతటి వాఁడితో నడరు కొమ్ములది
గ్రక్కున వెంకట రాజన్నదసరు
మిక్కిలి యుద్ధతి మీఱఁబర్వెత్తె.

మఱి రెండు మాఱు లిమ్మాడ్కిఁ జేయుమ్యె.
పఱచి తోఁపల్ చీల్చె పంది వేఁటరిని.
ఐనను ధైర్యమిం తైనను విడక
ఏనవమాఱు రా జీఁటె పారించి
గాటముగాఁ గొండె కాయపైఁ బొడిచె.
పోటుతో నేలంది భూమిపైఁ గూలె.
ఊరూరఁ బొగడుచు నుందురు నేఁడు
నా రాజు ధైర్యంబు నాకుళ్ళ మెచ్చె.

* అడవి పూటం దప్పిన
గాడిదకొడు, కనుచుఁ దిట్టఁ
గా విని, యయ్యో,
వీఁడా నాకొడు. కనుమను
గాడిద యెడిచెఁగదన్న,
ఘనసంపన్నా.

సమాప్తము.

---

* చాటువు